శ్రీ

శ్రీరస్తు.

చోళసింహ్మపురం

శ్రీలక్ష్మీనృసింహ్మస్వామివారి పేరున

# శ్రీహరినామ సంకీర్తనము.

ఇది,

చోళసింహ్మపురం గ్రామంలోనుండు వడమఘుర కరణం వీరాస్వామిపిళ్లకుమారుడు మునుగపిళ్ల గమ్సంచిన శ్రీహరినామసంకీర్తనము.

తిరుపతి.

పుండరీకనిలయ ముద్రాక్షరశాలలో

ముద్రింపబడినది.

1913

శ్రీ

# శ్రీ హరినామ సంకీర్తనము.

---

## శ్రీలక్ష్మీ నరసింహస్వామివారి పేరున పద్యము.

ఉ॥ శ్రీరమయంకపీఠమునఁ జెన్నలరారెడువాఁడు భక్తమం
దారుఁడు హేమగర్భప విదారుడతీతు డనంతుఁడాఢ్యుడున్
నారదమౌనివందితుఁడ నాథసురక్షకుఁడాది దేవుడున్
ధారుణినారసింహుఁడు ముదంబుఁదలిర్పఁగనన్ను బ్రోవుతన్॥

### కీర్తన

ఆదితాళము—పల్లవి.

నారాయణవాసుదేవా - నిన్ను
సన్నుతిమహానుభావా .. శ్రీమన్॥

అనుపల్లవి.

నారాయణహరి - గోవిందాయనినిన్ను
పారాయణముజేయు - భక్తులరక్షించు నారా॥

చరణములు.

అచ్యుతనందనా - ఆపత్ జనార్ధనా
ముచుకుందవరదనా - మురవినాశనా॥ నారా॥

లక్ష్మీసమేతా - సం - రక్షకనాదా
వక్షముతో నన్ను పాలించరాదా శ్రీమర్త నారా॥
శ్రీరఘునాదా - సీతాసమేతా
వారణమునుగదా - వరదుడై బ్రోవలేదా నారా॥
ఘటికాద్రిపురనివాసా - గాంభీర్యవుల్లాసా
యెటుతాళుదుయీశా- యేమందుజెగదీశా॥నారా॥

రూపకతాళము.

నారసింహ్మనిన్ను నెరనమ్మినాననేలరా
గోరపాపములను - దొలగించుముక్తిపాళరా॥నారా॥
పన్నగశయనస్నాతో - వంతమేల బ్రోవరా-నన్ను
కన్నతండ్రివై కరుణించు శ్రీమనోహరా నారా॥
నారదశుకాంగదుల్ - నుతించెదుపరాత్పరా
నేరములుంచకునాపై- నిర్మలాత్మ కావరా నారా॥
కందర్పజనకని -కన్నావేరేదిక్కెదిరానా
మందబుద్ధులమూన్న - మహానుభావనీవేరా॥ నారా॥
ఘటికాద్రివరనిలయ- గంభీరశుభాకరా
యెటుతాళుమ్మొక్కన్నన- కుటిలముబోగొట్టరా॥నారా॥

రూపకతాళము.

నిన్నువినా-వేరే దిక్కెవ్వరున్నారురా
నన్నుబ్రోవదేమియిది న్యాయమూకృపజూడరా॥నిన్ను॥
పన్నగశయనని - పాలిటచేరినానురా
అన్యులనెంచబోను- అయ్యానీవారలేదురా॥నిన్ను॥

సనక సనంద నాది - వందితుండు నీవురా
కనకాంబరధర - కరుణించుశరణంటిరా నిన్ను॥
ఘోళసింహ్వాపురనివాస సుందరనరసింహ్వారా
తాళజాలనెదుటవచ్చి - తప్పకరక్షించురా నిన్ను॥

ఆదితాళము—పల్లవి.

కలకంటినే నేడు నే- కలకంటినే నేడు కల॥

అనుపల్లవి.

కరిగిరివరదుడు యెదురుగవచ్చినట్టు కల॥

చరణములు.

చతుర్భుజములు-శంఖుచక్రములతో నాకు
సుదర్శనమై కరుణించి-బ్రోచినట్టు కల॥
కనకాంభరధర- కౌస్తువాభరణు నా
జననమరణసంచిత- మెడబాపినట్టు కల॥
సకలలోకములను- తనగర్భమందుంచిన,
అఖిలలోకనాయకు- డాదరించినట్లు కల॥
ఘటికాద్రిపురనివాస - నృసింహుడు
ఇటువగనుభక్తుని- హృదయమందు నిల్వ కల॥

ఆదితాళము— పల్లవి.

బృందావనలోలుడే-శ్రీహరి-బృందావనలోలుడే॥ బృం॥

అనుపల్లవి.

నా - మంద్రమదినిరూపై - సుందరాంగుడే- బృందా॥

చరణములు.

గంధర్వకిన్నర – కింపురుషాదులెల్ల
వందనములతో స్తుతియించు శ్రీనివాసుడె బృందా॥
ప్రహ్లాదనారదాది రుక్మాంగదుల్
పొగడుచునుండెడి – పరవాసుదేవుడె బృందా॥
సంచితముల నెల్ల – సాగగొట్టి పుటములో
ద్రుంచివేయుఘటికాద్రినివాసుడే బృందా॥

కాపిరాగము – అటతాళము.

నారసింహ్మా నళినదళాక్షా
నమ్మితినిన్ను నే జలజాక్షా నార॥
ఘోరపాపములను దొలగించు
వారధీబంధనా కరుణించు నార॥
పార్థసారథి -నీ- పాలజేరితి
ఆర్తరక్షక నీవేనునాగతి నార॥
కామక్రోధములో జిక్కి చాలా
పామరుడైతి పాలించునృపాలా నార॥
సుందరాంగా – సుభమంగళాంగా
వందనముభవభంగ శ్రీరంగా నార॥
ధరలో ఘటికాద్రినివాసా
వరమొసగుమిది వేళ జెగదీశా నార॥

క్వాల్ రాగము రూపకం—పల్లవి.

పార్థసారథి నీపదమునమ్మితి పార్థ॥

అనుపల్లవి.

శ్రద్ధనీకేరి నను కావునమ్మితి
శూరా వీరా - ధీరా గాంభీర పార్థ॥

చరణములు.

కరుణాపయోనిధి - కరుగదు నీమది
వరమునిస్తోమనిధి - వరసుగుణాంబుధి
వారధీశా బాసపావ పార్థ॥
సుందరరూపసరి - సుగుణామృతవల్లరి
వందితదాశరధీ - వాసుదేవసురేంద్రనుతి
వాదావాదినాబా దయరాదా రఘునాథా పార్థ॥
ఘటికాచలపతి - ఘనసుజైనధీమతి
యిటురా వేనాపతి కుటిలాత్ముడనైతి
యీశా పాపవినాశ సర్వేశ పార్థ॥

ట్యాక్ రాగము - ఆదితాళము — పల్లవి.

వసుదేవాత్మజ - వాసుదేవా వసు॥

అనుపల్లవి.

మనలుచున్నారా - నా - దెసనుజూడరా వసు॥

చరణములు.

నందకుమారా - నవనీతచోరా
వందనమీదెరా - వరమొసగరా వసు॥
సుందరపాదా - సుగుణవినోదా
అందరిలోపేదా - ఆదరించరాదా వసు॥

ఘటికాద్రీవర - ఘోటుకాళుదురా
భటునినేలర కుటిలవిదూర వసు॥
ఆదివల్లవి-యిందూస్థాని.
నారసింహ్మయేరా - నన్నుబ్రోవరారా నార॥
అనుపల్లవి.
వరాముఖమేరా - బలిమాలినారధీరా నార॥
చరణములు.
సుందరగంభీరా - సుగుణవైయ్యారా
వంతనమీదేరా - వచ్చినన్నేలరదొర నార॥
బాలానమ్మితిరా - సౌఖ్యములివ్వరా
కాకాజాలనురా - బాలునికావురావీరా నార॥
నామాత్మ్యతమీరా - నేమమొసగరా
పామరుడైతిరా - శ్రీమనోహరాకారా నార॥
చోళసింహ్మపుర - మేలెడివుద్వర
ఛాళీగొన్నానురా - నీలోవాడాదుగగదర నార॥
జెశికతోడిరాగము - రూపకం—పల్లవి.
నిన్ను నెరనమ్మినారా - నన్ను బ్రోవనదేరా॥ నిన్ను॥
అనుపల్లవి.
పన్నగశయనధీరా - కన్నులకృపజూడరా నిన్ను॥
చరణం.
అన్యుడనితలచకురా - అన్నా కోర్వరా
కన్నతండ్రినీవేరా - నన్నాదుకురా నిన్ను॥

చిన్న బుద్ధివాడనురా - మన్నించి రక్షించరా
నన్నుకాంగ గంభీర -నీ- కన్నా యెవరున్నారురా॥ నిన్ను॥
స్వర్ణఘటికాద్రీవర - ధన్యుడై ననాధార
క్రన్న నకరుణించరా - విన్నపము జేసేనురా నిన్ను॥

ఆదితాళము-బ్యాకడరాగము-పల్లవి.

నమ్మితిఘటికాద్రిపతినిన్ను - నా - నమ్మితి॥

అనుపల్లవి.

ఇమ్మహిలోమదిని - నమ్మితిగానునే నమ్మితి॥

చరణములు.

వాసుదేవ మా-ధవా మురారి
కేశవరాఘవకృప - జూడుము నరహరినే నమ్మితి॥
దుర్మతినహింకా - రాదులవలన నీ
మర్మముదెలియకను - కర్మములజెందితిల్లనే ॥ నమ్మితి॥
చోళసింహపుర - నివాసనృసింహానే
కాళజాలనీవేళ - తప్పక బ్రోవుము - నే - నమ్మితి॥

ఆదితాళము—పల్లవి.

రావేరా - రఘువీరా ॥ రా॥

అనుపల్లవి.

కావరా కరుణాకర గాంభీరా రా॥

చరణములు.

సుందరా - శుభాకరా
[illegible] - నన్నేలరధీరా రా॥

శ్రీధరా - సుగుణాకరా
ఆధారామెవరురక్షివేగరా రా॥
నాధోర - నీవేనురా
నరకేసరా కారాగావర రా॥

ఆదితాళము - పల్లవి.

నను బ్రోవరాదా - నాతోనీకువాదా నను॥

అనుపల్లవి.

వినుభువిమీద - వేరెవరుదిక్కున్నాసురనాధ। నను॥

చరణములు.

పన్నగశయన - పతితపావన
కన్నులజూచినీ-కరుణవుంచుమిది తరుణమహాను॥ నను॥
నీరజనయనా - నిఖిలపోషణా
కరినిగాచిన కరివరద రాజనాదోరవుగాన నను॥
నరకేసరినా - గురుడునీవేను
దురితముమాన్పి-త్వరగలోగావు ముర్హారి వర్హరి॥ నను॥

తోడిరాగము - ఆది—పల్లవి.

రాదానామీద్దా - దయరాదానామీద రాదా॥

అనుపల్లవి.

ప్రాణాదాసీతసమేత - వాదాయిఖ రాదా॥

చరణములు.

ఆధారమునీవని - పాదాంబుజములను
శ్రీదరావమ్మురి - పద. బోదాదానునరావా రాదా॥

యథార్థముగనిను - మదిఁ దలచినే
సదాబజించెదను - శుదర్శనమైబ్రోవ రాదా॥
వేదచోఘ్యఘటి - శాద్రినాథానను
శోధించుటమరి - యాధమాధవకృప రాదా॥

ఆదితాళము- సురటిరాగము-పల్లవి.

రామాననుబ్రోవుమా - శ్రీ రామాననుబ్రోవుమా శ్రీ॥

అనుపల్లవి.

వామాజగదభి - రామాసద్గుణ
స్తోమా పరాంకుశనామా దశరథ- శ్రీ॥

చరణములు.

కామాదులచే - నేమాదులువిడచి
యేమారితిపరం - ధామాపట్టాభిరఘు రా॥
సీతాసమేతసద్ - బోదాసురార్చిత
పాథాథ కృప్రియుడు - శాదాకల్యాణగుణ రా॥
యీశాఘటికాద్రిని - వాసాదాసాదుల
పోషాభవబంధవి - నాసానరహరి .. రా॥

బ్యాక్ రాగము- ఆదితాళము-పల్లవి.

శరశింప్షోనిన్ను నమ్మినారా శర॥

అనుపల్లవి.

నిన్ను నమ్మినారా-నన్ను బ్రోవదేరా ధీరా॥ శర॥

చరణములు.

శరమదారాకర - శరణంటినిరా

కరుణవుంచవేమిరా - తరుణమిదేరా - వర - నర॥
శ్రీధరదామోధరా - యీాధరయందురా
ఆదరించరావేరా - ఆభారాశినకాంభర - ధర- నర॥
శంఖుచక్రధరా - చాలనమ్మియున్నారా
సంకటంబుమాన్పరా - పంకజదళనేత్ర -దొర॥ నర॥
చోళసింహ్మపుర - మేలుక్సపాశరా
తాళజాలనుర - పాలించురసుందర వర॥

అటతాళము - పల్లవి.

నమ్మినవాడను-నేను-నిన్ను-నమ్మినవాడను-నేను

అనుపల్లవి.

ఇమ్మహిలోమదిని - సమ్మతిగాను నమ్మి॥

చరణములు.

చరణారవిందముఖుందా-నీ- శరణుజొచ్చితినినచ్చితా నందా - కరుణించుగోపికానందా - యిది - తరుణముకావరా - సూదగోవిందా నమ్మి॥

సుందరరఘువీరానాదా - నా - బాధము తెళటార్చ్చ మానందబోధా- వందనమురజగన్నాదా నాముందువచ్చి కన్నైనా - పాలించరాదా వర॥

పరమదయాకరరంగా - నాతరముకాదు త్రోవజూపు పత్సంగా - మరవరునూతభవభంగా నన్ను అరమరజేయకు రాగనరసింగా నమ్మి॥

రూపకతాళము - దర్బార్ రాగము-పల్లవి.

పుండరీకాక్షా - పరంధామా పుండ॥

అనుపల్లవి.

దండమురకావరారా- అండజేరితిని కావరా॥ పుండ॥

చరణములు.

చండప్రచండకో-దండము చేబట్టు సమరభీమా ఆ దం
డధరునినాయండజేరకుండా జేయుము భక్తకామా-అండ
ద్వయభువికేశా - ఆదరించుర సర్వేశా పండరి పురిజగ
దీశా భక్తున్నిబ్రోవుముయీశా పుండ॥

చరణారవిందముచుముకుంద- గోవిందా సచ్చితానందా
నీశరణుజొచ్చితిని కరుణవుంచు మిది శరణము రామ
చంద్రా- సాకేతపురములోనదా- ధన్యుడవైయుండలేదా
లోకేశుడునీవేగదా - శీఘ్రముపాలించరాదా పుండ॥

శ్రీధరదామోధరా నామీదేలవాదురా - పరికాదుర
యిఖమిద్దుర దయజూడుము గదరా కాళింగనిర్ధనధీరా
ఘటికాద్రినివాసవరా తాళజాలనుర వేగరా తనయుని
నేలరరఘువరా పుండ॥

తోడిరాగము - రూపకతాళము- పల్లవి.

పురుషోత్తమననుబ్రోవు -
సంపూజ్యనామా - భక్తకామా॥ పుస॥

అనుపల్లవి.

శరణాగతి - యసిప్రముక్తి

సమయము కావరరఘుపతి
నిమిషము వ్రార్థ్యను శ్రీపతి ॥ పుర॥

చరణములు.

కరుణాకరగాంభీరా – తరుణముసంపన్నధీరా
వరుణునిబ్రోచినవీరా వారిధిశయన కృపాకరా
వేరుదిక్కువరునాన్పదరా పుర॥
వేదవేదాంతబోధా – శ్రీధరారక్షించరాధా
పాతకుడవనినామీదా పగబూనుటమరియాదా
పాలించురసద్బోధా పురు॥
ఘటికాచలగిరివాసా – కుకీలము
బోగొట్టుమీశా – వరపత్రశయనవుల్లాసా
వైదేహీమనోన వైకుంఠపరమేశా పురు॥

రూపకం–పల్లవి.

యీవేళబ్రోవరా – రఘువీర–యీవేళబ్రోవరా యీ॥

అనుపల్లవి.

నీవేఘటియనికుదిని–నిజముగనేనమ్మితి॥ నీ॥

చరణములు.

తాపత్రయములులోబడి – ఆపదజెందితి – నేచెడి
శ్రీపద్మనాభానీ తిరువడి – జూపుము
యిపుడెకృపతోడ నీ॥
కామక్రోధాదులవల – నేమమువదలితినేచాల
పామరుడైతిరాధాలోల్ల–యేమందురకరుణాలవాల॥ యీ॥

శ్రీధరఘటికాద్రీవర - అధరపని(?)రాముక్తిలిర
యీధరలోనాముందర - నీదయలేక నెట్లోర్తుర॥ యీ॥

ఆదిపల్లవి.

రారారామచంద్రా - రక్షించ వేగ రారా॥

అనుపల్లవి.

ధీరాదశరధకుమారారణరంగ
శూరాకరుణాకర - గాంభీరాతరుణమీదే॥ రారా॥

చరణములు.

సీతాసమేతసతీ - బోదాపట్టాభిరఘు
నాధానామీదదయ - లేదానను పాలించ॥ రారా॥

వామా వైకుంఠపరం - ధామాదశావతార
నామావళినాతు శ్రీ - రామానాపాలిటి రారా॥

వాసాచోళసింహ్మపు - రీశాభవబంధవి
నాసానరహరిజెగ - ధీశాదాసునిబ్రోవ రారా॥

కమాసిరాగము - ఆది-పల్లవి.

కావరాఘటికాద్రిపునివాసా - కరుణాకరేశా కావ॥

అనుపల్లవి.

కావతాతరుణమురర - ఘుతిసీవేరాగాంభీరా
శ్రీవరరఘువీర - చిత్తగించియు వేగరా కావ॥

చరణములు.

బాలాప్రహ్లాదునినీవు - మేలిమితోగాచినావు
యీలనామొరవినవు - ఆలకించను రావు రావాదే

వాదిదేవా రక్షించుమహానుభావా కా॥
శ్రీధరధామోధరా - నీవాడరనన్నేలరా
ఆధర వెవరురా - అంభుజదళనేత్రా నేత్రాఅక్షయ
పాత్రా నిర్మలజనస్తోత్రా కావ॥
నారసింహ్మయ్యనీనిన్ను - సారెసారెకుగోరెదు
నేరముమాన్పికను- నిమిషముప్రొర్వలేను లేను నీపా
దమునమ్మి నానురాయీభువిలోను కావ॥

బ్యాక్ - రూపకం.

వంజనేవిఅనరిప్పాయి- వాంచలింగేశా నానోర్గళ్ నేసా.
నారసింహ్మనన్నుబ్రోవు - నమ్మినానురా
నమ్మినానురా - నాయురవినవేరా నార॥
శ్రీధర దామోధర - నీ చిత్తముంచరా
చిత్తముంచరా - చిరుతినుబ్రోవరా నార॥
ఆధరవనిమ్రొక్కితినిరా - ఆలకించరా
ఆలకించరా - అమృతవల్లీశ్వరా నార॥
ప్రహ్లాదునిగాచిన - భక్తవత్సలయిటురా.
భక్తవత్సలయిటురా- పరవాసుదేవరా నార॥
చోళసింహ్మపురిలో వెలయు - సుందరాకారా
సుంధరాకారా - సుఖములివ్వారా

తోడిరాగము - రూపకం-పల్లవి.

నారసింహ్మస్వామీ-నన్నుబ్రోవదేమి రాము॥ నార॥

అనుపల్లవి

భారామానన్నేలుమీ-పరమకల్యాణపరాకేమీ॥ నార॥

చరణము.

కరుణనుంచవేమీ - కటాక్షించుమంతర్యామి
తరుణము చేవిడకుమీ-దాసుడేనుదయనేలుకోమీ॥నార॥
జన్మము త్రిశీభూమీ - జలజాక్షానాథారసామి
కర్మముబోగొట్టుమీ-గాంభీర్యమునకృపజూడవేమి నార॥
యేకశ్శిలపర్వతిమీ - దేలికై వెగ్గెడిసామి
పాకారినుతమా - మీ-పాదములిపుడేజూపుమీ ॥నార॥

క్యాల్ రాగము-ఇంగ్లీషుమెట్టు-ఆది-పల్లవి.

నన్ను బ్రోవదేమిరా - నాగశయనవేగరా.

అనుపల్లవి.

నిన్ను నమ్మినానురా-నీకన్నాయెవరున్నారుర॥ నన్ను॥

చరణములు.

శ్రీధరదామోధరా - వాదుచేయతగదురా
బీదయందేలక్రోధరా-ఆధరించుప్రాణాధారా॥ నన్ను॥
బాలునేనివాడరా - పరమానందదయాకరా
చాలుకష్టముమూన్పరా-పర్వలోకశరణ్యారారా॥ నన్ను॥
చోళసింహ్మపురీశ్వరా - సుందరకరుణాకరా
శాళిజాలకావరా - తప్పులన్ని క్షమించరా॥ నన్ను॥

జెంజూటిరాగము - ఆదితాళము.

చరణములు.

నారసింహ్వాయని నేను - పిలచితె నాతోపలుకవేమి
వేరుదిక్కెవరున్నారు నా -
యెదురుగ వెనలిరా తాపామి నార॥
నందనందనగోవిందముకుందా - బృందావనలోలా
వందనమురశ్రీసుందరాంగవను - దేవదేవకీబాల॥ నార॥
యెన్ని విధంబులు వర్ణన జేయుదు - కన్నతండ్రి రారా
చిన్న బుద్ధివాడను - అన్నితప్పులున్ను మన్నించిరక్షించరా॥
వరాకేలశ్రీధరాదామోధరా - భక్తుని బ్రోవదేరా
శురేంద్రవందిత - వరాహవతారా - సుధాకరసుధీరా॥ నార॥
చోళసింహ్మపురినేలుమురహారి - సుతునికావరశౌరి
బాళిగొన్నానుర తాళజాలనుర - పాలించుర నరహరి॥ నార॥
జెంజూటిరాగము - ఆదితాళము.
నారసింహ్మనీనళినపదంబులు - యేాలజూపరావు
దరధరధరకుమారకృపాకర - చిరుతనిపుడుబ్రోవు॥ నార॥
బాలుప్రహ్లాదుని యీ - నేలకరుణవుంచిబాలబ్రోవలేదా
మూలమనినకరిరాజునిగాచినమురహరినీవెగదా నార॥
పంచపాండవులభార్య మొరవిని - పాలించినస్వామి
పంచాయుదపరవాసుదేవ - పరమాత్ముడనాస్వామి॥ నార॥
కారుణ్యాకర - కౌస్తుభాభరణకాళింగనాటవవీరా
నీరజనయననీ - శరణుజొచ్చితిని - నిమిష మూర్వలేరా నార॥

శ్రీధరధామోధరా - నాయందునీచిత్తముంచవేరా
బీదయందువాదేలర-రఘువరప్రసన్నముగరారా నార॥
చోళసింహ్మపురమేలుదయానిధి - సుజనామృతవల్లీ
శా వేళయిఘే-నే-తాళజాలనుర వెడలుజెగధీశా నార॥

ఏకతాళము-పల్లవి.

నిన్నునమ్మినాను - నీరజనయనా నిన్ను॥

అనుపల్లవి.

నన్నుబ్రోవదేరా - నారశింహ్మధీర వీర నిన్ను॥

చరణములు.

పన్నగశయనా - పతితపావన
విన్నవించెదను - నిన్నేకోరెదనునేను నిన్ను॥
కరుణాకరనీ - శరణుజొచ్చితిని
తరుణముగాన - త్వరగనేలుగరుడగమన నిన్ను॥
ఘటికాద్రివాస - గాంభీర్యవుల్లాసా
ఘటుకలోత్తదాస - పోషుడసర్వేశయీశా నిన్ను॥

మధ్యమావతిరాగము-ఆదితాళము-పల్లవి.

కంచివరదునిసేవించుడీ - జనులారామీరు కంచి॥

అనుపల్లవి.

మంచివేళమరినెంచి ఆశ్రయించి
సంచితప్రారబ్ధములనుద్రుంచెడి కంచి॥

చరణములు.

గరుడగమనరాజభోగి - కారుణ్యత్యాగి

శరణుజొచ్చినవారణము మొరవిని ఆ
తరుణముమకరిని - ద్రుంచిరక్షించిన కంచి॥
చింతలెల్లనుబోగొట్టును - జగద్విరాట్టును
అంతర్ముఖమున - నిరంతరముగ నుతియింపుచుదేవుని
పంతముతోజేరి కంచి॥
దాసదాసులబ్రోవుజగదీసు - ఘటికాద్రినివాసు
పాశబంధముల - నాసముజేయుశ్రీని
వాసమూర్తిని - ద్వేషరహితుడని కంచి॥
నాధనామక్రియరాగము - అటతాళము-పల్లవి.
నరసింహ్మనినునమ్మినారా లక్ష్మి
నరసింహ్మనినునమ్మినారా నర॥
అనుపల్లవి.
ధరలోఘటికాద్రినివాసా - నా తరముకాదు
బ్రోవజూవుజెగదీశా నర॥
చరణములు.
పరమపురుషా పాండురంగా - నన్ను పాలించిరక్షించరా
భవభంగా - యిదితరుణమురారా సత్సంగా-యిఖ తామ
సము జేయ - తగదుసుభాంగా నర॥
అమృతవల్లి తల్లిసమేత- నన్నుఆదరించరా తామసగుణా
తీతా బ్రహ్మరుద్రాదివినుతా - యీబీదయందు దయ
లేదాసద్బోధా నర॥
వేదచోద్యరఘునాథా- నీపాదముసమ్మితిరా-జగన్నాదా

శ్రీధరానామోదవాదా - నరికాదుర నీకుఘంభీర్యవి
నోదా నర॥

ఆదితాళము- పల్లవి.

దేవాదిదేవానను - శ్రీఘనముకావరావా॥ దేవా॥

అనుపల్లవి.

నీవాడనౌదునేసదా - నిన్ను నమ్మినానుగదా॥ దేవా॥

చరణములు.

పామరములోజిక్కి - బండ్లబడిచాలాచొక్కి
ప్రేమతోనిన్ను మ్రొక్కి - బీదయుండు
పక్షిరొక్కి దేవా॥

కరిరాజుమొరవిని - ఖండించమకరిని
నరగునచక్రమున - సంహారించి గాచిన॥ దేవా॥

ధరనుఘటికాద్రివాసా - దయయుంచరానర్వేశా
సురనుతిజగదీశా - సుందరనారసింహ్వాసా॥ దేవా॥

రూపకతాళము-పల్లవి.

కరుణించరారా-రఘువీరా-కన్నతండ్రివినీవేరా ॥కరు॥

అనుపల్లవి.

తరుణమునికరణుజొచ్చితి - తక్షణము రక్షించపక్షివా
హానుడై కరు॥

చరణములు.

వేదవేదాంతవేద్యుడై - నఖిలజనులరక్షకుడై
సాధునజ్జనహితుడై- సంపూర్ణకరాక్షవీక్షణ్యుడై॥ కరు॥

తుంబురునారదాదిస్తుతింపగ - శ్రుతివీణసంగీతము మెరయు
గసంభ్రమముతోడ లక్ష్మీసమేతుగ - తనయునికేవేళ యెదు
రుగ కరు॥
చోళసింహపురిలోనివాసా - సుందరలక్ష్మీ మనోల్లాసా
తాళజాలనుర జెగదీశా - దాసుని బ్రోవరారాభవనాశా
కరుణించరారా॥

ఆదితాళము - పల్లవి.

లక్ష్మీనృసింహా - నమ్మితిబ్రోవుమా లక్ష్మీ॥

అనుపల్లవి.

పక్షముతోనన్ను - పాలించరాప్రేమా॥ లక్ష్మీ॥

చరణములు.

సౌందర్యనాదా - శుభగుణబోదా
వందనముజేశెదా - వైకుంఠవినోదా లక్ష్మీ॥
బాలుప్రహ్లాదుని - బ్రోచినవాడని
చాలానేనమ్మితిని - సౌఖ్యములిమ్మని లక్ష్మీ॥
ఘటికాద్రిలోనివాసా - గాంభీర్యవుల్లాసా
కుటిలముమాన్పుమీశా - గోపికాహృద్విలాసా॥లక్ష్మీ॥

ఆదితాళము - పల్లవి.

నారాయణనినునమ్మితి- ననుబ్రోవరాశ్రీయఃపతి నా॥

అనుపల్లవి.

పారాయణముచేయుభక్తులను
పక్షముతోను - రక్షించను శ్రీమన నార॥

చరణములు.

కరుణాకరా - శరణంటినిరా
తరుణమవునురా తనయునినేలరా నార॥
సనకసనంద - నారదాదులను
దినముబాగడు - దీనదయానిధే నార॥
ఘటికాద్రియందు - వెలయున్నృసింహ్మ
భటునిగావనీ - పాదమెఘుతి శ్రీమన్ నార॥

ఆది-పల్లవి.

ఆనందంబ్రహ్మానందం - గోవిందంభజగోవిందం

అనుపల్లవి.

ఆనందగురుడగు - అనంతశైనుని సం
జ్ఞానముతో - భజియించెడివారికి ఆనం॥

చరణములు.

లోకనర్మలుతెన - పోక తెలుసుకొని
లోకేసునినుతి - యించెడివారికి .. ఆనం॥
సనకసనందస - సజ్జనులందరు
దినముబాగడుదేవుని - గొలుచువారికి ఆనం॥
ఘటికాద్రిపురనివాస- నృసింహ్మని
ఘడియఘడియకు - స్మరణించినవారికి ఆనం॥

ఆదితాళము-పల్లవి.

పాలిటరా శ్రీమన్నారాయణా నా

అనుపల్లవి.

యీ - బాలుని బ్రోవుర వేదనారాయణా నా

చరణములు.

ఆలుబిడ్డలను అన్నతమ్ములను - జాలమైనసంపదలెల్లను
చాలమరియుకలిగిన నేమిఫలము రాదుర -
నాకొకస్తోవజూపను పాలి॥
ధనకనకవస్తువాహనములుండిగను
ధరనునరాధిపుడనుపేరెత్తినను
ఘనమైననీపాదాంబుజములను
స్మరణచేయనినరు జేలనీభువిని పాలి॥
సనకసనందన - సనత్కుమారులు
సకలమునులునీచరితులను దినము ప్రగడఘటికాద్రిని
వాసా తల్లియమ్మతవల్లమ్మసమేతుడై పాలి॥

ఆదితాళము-పల్లవి.

నారాయణనన్ను బ్రోవరా నారా॥

అనుపల్లవి.

నారాయణనీ - నామస్మరణము
పారాయణము - జేయుభక్తుడను నారా॥

చరణములు.

కరుణాకరా నీ - శరణుజొచ్చితిని
వరమొసగను - వచ్చియెదురుగ నారా॥
బాలుప్రహ్లాదుఁ పాలించినదేవా

తాళజాలను నేను - దయతో యీవేళ నారా॥
ధరలో ఘటికాద్రి - చల శ్రీలక్ష్మీసా
పరమదయానిధా - భవబంధవినాశా॥ నారా॥

రూపకతాళము-పల్లవి.

వెంకటేశ్వరాని నువేడితి - జగదీశ్వరా శ్రీ వెంక॥

అనుపల్లవి.

సంకటంబులను దూర్చి - సౌఖ్యములివ్వను రారా॥ వెంక॥

చరణములు.

హరినామదివ్యపారాయణులు
నరశిజభవసజ్జనావళులు
నిరతమునిచుబాగదుఃభక్తుల
నేరములను తీర్చి - ఘనుడా వెంక॥
అఖిలలోకములలో నుండు
సకలజనులందరునీకు
నిఖిలలోకగాయకుడనని
సకల కానుకల చెల్లింతురుగా వెంక॥
ధరను ఘటికాద్రినిలయు తనయునిగాపుమునద మా
పరమః లాసగుమప్రమేయ వాసవార్చితా- భయ॥ వెంక॥

ఆదితాళము.

శ్రీరామా శ్రీరామా - సీతాసమేతరామా
వారిజాక్ష రామా - వైకుంఠాధిపరామా శ్రీ॥
కారుణ్యాకరరామా - కౌశల్యాసుగుణరామా

మారుతిసమేత రామా - మంగళాకర రామా శ్రీ॥
అయోధ్యా రఘురామా - ఆదరించుమహరి రామా
శయ్యానను శాపు రామా - జానకీపతే రామా శ్రీ॥
దశకంఠఖండన రామా - తాటకీమర్దన రామా
శచిపతినుతి రామా - సౌందర్యకల్యాణ రామా శ్రీ॥
ఘటికాద్రిగిరి రామా - ఘనుడౌనరిహరి రామా
వరభద్రశైన రామా - వైరివిదూరుడ రామా శ్రీ॥

శ్రీకృష్ణస్వామిపేరున గొబ్బిపాట.

గొబ్బియళ్లో- గొబ్బిగొబ్బియని వేణుగోపాలుని
పాగడరే గొ॥
,, దుష్టులనుశిక్షించను-కృష్ణుడుఅవతరించే గొ॥
,, నందగోపాలునిభార్య-నాయకిదుపులోనే॥ గొ॥
,, చంఖుచక్రములంతోడ-స్వామిపుద్భవమయ్యేనే॥
,, రేపల్లెయశోదవద్ద-రాత్రిలోనేమా రెసపుడే॥గొ॥
,, కంసునికిరాతసిని - కన్ను బెదర జేశేనట గొ॥
,, కాకిటవృతమునకు-వాసుదేవునికట్టినటచే॥ గొ॥
,, కట్టినవమానులురెండు-కవ్వళిం చదొల్లించెనే గొ॥
,, దొల్లినమానులురెండు-దేవతులైప్రమొక్కేనట॥
,, దేవతలునిశాపగాన్ని-దైవలోకంజేరిరటా॥ గొ॥
,, గోపాలబాలురతోడ-గోవులనుమేపెనట॥ గొ॥
,, వేణునాథంబుబట్టి-వేణుగోపాలూడెనట . గొ॥
,, కాళింగమడుగులోన-కాళింగునిబట్టుకొని గొ॥

,, కాళింగునిగర్వమణచి-కళంకమైనిగ్గవంచేశా॥గో

,, దూడలనువిప్పిదోలి-దొంగలించిపాలుతాగె॥గో

,, వుట్టిమీదనున్నపెరుగు - కట్టికోనుతాగినాడే॥

,, గోవర్ధనగిరియెత్తి - గోవులబాలులగాచె గో॥

,, శకటమైవచ్చినసురుని-సంహరించివేశినాడు॥గో॥

,, చక్రమునుపంపిజరా - సందనునిజంపినాడే॥గో॥

,, గోపికలున్నీళ్ళాడగా-కోరిఅచ్చటపోయినాడు॥గో॥

,, చీరలంతాయెత్తికూను-సిఖరమునతగిలించెనే॥

,, స్త్రీలందరువెదికిచూడ-చిన్నికృష్ణుమానిలుండె

,, మానిమీదనుండుస్వామిని-మానముపోయినదని

,, వేమకొనికొరబెట్టగా -వేణునాధుడేమన్నాడు॥

,, చేతులురెండెత్తినన్నా- శికరముపైమ్రొక్కితేనే॥

,, చీరలుయిస్తున్నానని-శ్రీమాధవుజెప్పెనట॥గో॥

,, గోపికలచీరలెల్లా- దాపిమోసముజేశెనే గో॥

,, వొక్కొక్క గోపికలకు - వొక్కొక్కకృష్ణుడాయనే .. గో॥

,, కాళింగమడుగులోన-కలశిక్రీడజేశెనట గో॥

,, అష్టభార్యలున్న పది-ఆరువేలగోపికలు గో॥

,, ఇష్టమైనట్టువార్లకు-యేకమైసంభోగముజేశె॥గో

,, కంసునిగర్వమణచి-కాలునికిప్పగించె గో॥

,, ద్వారకాపురములోన - దంపతులైయుండినాడు గో॥

,, అస్తినాపురములోన-అరమనలలడిగెనే గో॥
,, విదురుదమాంతం యిద్ది-మీాయిల్లని జెప్పెనట॥
,, అచ్యుతుసంతోషముగా-అన్న భోజనంబు చేసె॥గో
,, పాండువులకు సంగతుల్ పల్కి బోధించెనట॥గో॥
,, అర్జునునకు సారథ్యం-అచ్యుతసంతసుండై నా॥గో॥
,, పాండవులనుముందు పెట్టి-కగవారలసంహారించె॥
,, ధర్మరాజుకు పట్టాభి-ధరియించినేలుతుండె గో॥
,, పాంచాలమ్మ పభ్బంబు - భగవంతుడు ముగించె॥
,, ధరలోఘటికాద్రినివాసు-దేవనృసింహస్వామి॥
,, దాసులకోరికలను- తప్పకయిచ్చిరక్షించె గో॥

మంగళము-రూపక తాళము.

జయమంగళము - నిత్య-శుభమంగళం రామా॥ జయ॥
రామునకు కౌశిక - భరతశత్రుఘ్నులకు - ధీమణి
సంజీవిరాయది వ్యాళగునకు జయ॥
ఆపద్బాంధవునకు - యఖిలజనాప్తునకు
శ్రీపద్మనాభునకు - జయరఘునాధునకు॥ జయ॥
జానకిసమేతునకు - జగదభిరామునకు
దానవసంహారునకు - దశరథతనయునకు జయ॥
లక్ష్మీనృసింహునకు మ్మెవల్లీనునకు
పక్షివాహనమెక్కు - పరమాత్మకు జయ॥
ఘటికాద్రినిలయునకు - ఘనభుజగశయనునకు
సనకసనందనారద - తుంబురులకొప్పకు జయ॥

నలువనుగనినదొరకు - నళినా ప్తకులజునకు
కలుములనలితొగడు - కమలాక్షునకు జయ॥

లాలి

శ్రీరామచంద్రలాలి - శ్రీహరి సీతాసమేతలాలి
వారిధీశయన లాలి - జయవినుత -
వైకుంఠవాసలాలి॥ శ్రీ॥

ఆదిమూలమె అనిన కరిరాజు - కభయంబునొసగాచిన
వేద వేదాంగవినుత-కరివరద-రాజభోగేంద్రలాలి శ్రీ॥

మత్స్యకూర్మవరాహ నారి-వటు రామ- రామరామా
అచ్యుత కలికతోడ - దశనాదు - అవతా
రమూర్తిలాలి శ్రీ॥

నవనీతచోరలాలి - శ్రీరంగ - నాగేంద్రశయనలాలి
భవబంధ వినాశలాలి - పరంధామ-
పరమకల్యాణలాలి॥ శ్రీ॥

లక్ష్మీనృసింహలాలి - వరవాస - లోకేశనాథలాలి.
వడమునభ-క్తజనుల-కరుణతో పాలించు భవ్యలాలి। శ్రీ॥

ఘటికాద్రినిలయలాలి - ఘనతర - కౌస్తుభాభరణలాలి
వటపత్రశయనలాలి - వసుదేవ-దేవకీతనయలాలి॥ శ్రీ॥



## హెచ్చరిక.

హరి హెూంనమో నారాయణా అఖిలజగన్మోహనా
    పరిపూర్ణకళాత్మ పరంధామా హెచ్చరిక హ॥

సనకసనందాదుల్ నారదశుకాంగదులుగా
    దినమునిను వొగడు దేవదేవా హెచ్చరిక హ॥

మత్స్యకూర్మ వరాహహరి । వామన రామ రామా
    అచ్యుతజార్ధకావతారా హెచ్చరిక హ॥

ఆదిమూలమనిన కరి - రాజును గాచిన
    వేదవేదాంతాకర - వరదా హెచ్చరిక హ॥

చోళసింహపురీశా - సుందరలక్ష్మిసా
    ఈ - వేళను బ్రోవు - జగధీశా హెచ్చరిక హ॥